Regd.No.
H. Nb. [illegible]
సంపుటి: 56
సంచిక: 29

# జమీన్ రైతు

స్థాపకులు : నెల్లూరు వెంకట్రామానాయుడుగారు
సంపాదకుడు : నెల్లూరు శ్రీరామమూర్తి

19-7-8[illegible]
శుక్రవారం
12 పేజీలు
75 పైసలు.

# తెలుగు గంగ వివాదం ప్రతిపక్షాల సృష్టా?

కర్ణాటక ముఖ్యమంత్రి రామకృష్ణ హెగ్డే అర్ధాంతరంగా ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు విపరీత ప్రచారం కల్పించిన తెలుగుగంగ ప్రాజెక్టు భవిష్యత్తు సందేహంలో పడింది. నిన్నటి వరకు భాయిభాయి అనుకున్న హెగ్డే, రామారావులు నేడు ఒకరి ప్రకటనలను మరొకరు ఖండిస్తూ పరస్పరం విరుద్ధ ప్రకటనలను జారీచేస్తున్నందువల్ల రాజకీయ వాతావరణం బాగా వేడెక్కుతోన్నది. గత ఆగస్టులో నాదెండ్ల భాస్కరరావు చీలికతెచ్చి, ప్రభుత్వాన్ని పడగొట్టినప్పుడు తెలుగుదేశం ఎం ఎల్ ఏ లను కర్ణాటకలోని నంది హిల్స్‌లో దాచిపెట్టి, రామారావు తిరిగి అధికారంలోకి రావడానికి ఎంతగానో తోడ్పడిన హెగ్డే,



## రామకృష్ణుడల్లా వృత్రాసురుడైన హెగ్డే!

తెలుగుగంగప్రాజెక్టు కర్ణాటక ప్రయోజనాలను దెబ్బతీస్తున్నదని ఆ ప్రాజెక్టును అనుమతించకూడదని ప్రధానికి లేఖ రాయడం పరిశీలకులకు విస్మయం కలిగించింది. తెలుగుదేశం పార్టీలో ఈ పరిణామం తీవ్రకలవరాన్నికూడా రేకెత్తించింది. తాత్కాలికంగా ఇబ్బందికరంగా పరిణమించినప్పటికీ ఈ వ్యవహారంలో రాష్ట్ర ప్రజలందరి నైతికమద్దతు తప్పనిసరిగా తనకేలభించే అవకాశమున్నందువల్ల గండం గట్టెక్కగలమని ముఖ్యమంత్రి రామారావు భావిస్తున్నట్లు తెలుస్తున్నది.

ప్రజలసంగతి దేవుడెరుగు. రాష్ట్రంలోని ప్రతిపక్షాలు మాత్రం ఈ వ్యవహారంలో కలాపకవైఖరి అవలంభిస్తున్నందువల్ల మరింత అయోమయపరిస్థితి ఏర్పడుతున్నది. మద్రాసుకు మంచినీటి పథకంతోపాటు రాయలసీమ ఇరిగేషన్‌కు కూడా నీటిసరఫరాకు వీలుగా తమహయాంలోనే ప్రస్తుత పథకం రూపొందించడం జరిగిందని, రామారావు తెలుగుగంగ అని పేరుమార్చి అంతా తానేచేశానని ఆ ప్రాజెక్టుకు బాగా ప్రచారం ఇచ్చినందువల్ల ఈర్ష్యఏర్పడి కర్ణాటక అభ్యంతరం రావడానికి దారితీసిందని పి సి సి అధ్యక్షుడు శ్రీ వెంగళరావు చెప్పారు. 1984 లోనే కర్ణాటక ముఖ్యమంత్రి తెలుగుగంగ ప్రాజెక్టుకు అభ్యంతరంతెలిపితే అటువంటిదేమీలేదని పదేపదే ప్రకటించి, చివరకు కర్ణాటక మంత్రి దేవగౌడ ప్రకటించేవరకు అసలువిషయం చెప్పకుండా దాచిపెట్టి ప్రజలను, మిత్రపక్షాలను ముఖ్యమంత్రి మోసంచేశారని బి. జె. పి. విమర్శించగా, ఈ వివాదం తేలేవరకు కేంద్రమే అసలు దోషి అని సి. పి. ఐ. ప్రకటించింది. ఇబ్బందిలో పడిన రాష్ట్రానికి మాత్రం తోడుగా

-కొనసాగింపు 10 వ పేజీలో

## పత్తికొండకెందుకు పోలేదు?

రేపు (21 తేది) జరగనున్న పత్తికొండ నియోజకవర్గం ఎలక్షన్ ప్రచారానికి తాను పోవడంలేదని ముఖ్యమంత్రి శ్రీ రామారావు ప్రకటించారు. ఈ నిర్ణయానికి కారణమేమిటా అని రాజకీయ పరిశీలకులు వూహిస్తున్నారు.

రామారావుగారు ప్రచారం చేయకుండా రాష్ట్రంలో ఒక్క ఎన్నిక కూడా జరగలేదు; తాజాగా జరిగిన కావలినికూడా సందర్శించినారు. అటువంటి రామారావు తనపార్టీ ఎం. ఎల్. ఎ. హత్యవల్ల ఏర్పడిన ఉపఎన్నిక ప్రచారం ఎందుకు బహిష్కరించినట్లు? తమ కాపవరపు హత్యానేరంలో మొదటి ముద్దాయి అయిన రామకృష్ణారెడ్డి తమపార్టీవాడు కావడంతో చటాలా? ఆ ప్రతికూలత ప్రచారానికి ఉన్నదని ముఖ్యమంత్రి భయపడ్డారా?

కత్తులు చూపి కత్తులతోకలిసి తిరిగిపోతున్న ప్రొద్దుటూరు ఎం ఎల్ ఎ వరదరాజులురెడ్డి కవచమున్నాడట రామారావుకు; మొన్న అసెంబ్లీలో రాష్ట్రపతికంటే తనకే ఎక్కువ

-కొనసాగింపు 8వ పేజీలో

# దొంగలున్నారు జాగ్రత్త!

ఆత్మకూరు చుట్టుప్రక్కల గ్రామాల్లో ఇటీవల కళ్ళుగొట్టారుండ్లి తిరుగుతూ దోపిడీ చేసే మాయా దొంగలు తిరుగుతున్నట్లు వార్తలందుతున్నాయి; అందరినీ భయపెడుతున్నాయి.

ఆత్మకూరు టౌనుకు చెందిన ఒక గృహిణి దగ్గరకు, పదిరోజుల క్రితం ఎవరో ఒక అపరిచిత వచ్చిందట, పిల్లల గ్రోపి పట్టుకుని తిరిగే స్వామిజీ ఇక్కడేమైనా వచ్చారా? అతడు మా పైకానికి తెలిసిన మనిషి, మా పిల్లవాడి జబ్బు నయం చేయించుకోవడానికి వెతుకుతున్నాము అని చెప్పిందట.

తర్వాత రెండు రోజులకు చెప్పినట్లే పిల్లల గ్రోపి చేతపట్టుకుని ఒక ప్రబుద్ధుడు దిగాడట, ఆ పమా గృహిణి అతన్ని చూసి తప్పితప్పిపై, సహజావంతంతో ఇంట్లోకి స్వాగతించి సకల మర్యాదలు చేసిందట, ఆమెకు [illegible] జబ్బు ఉందట 1800 రూపాయలిస్తే దాన్ని ఒకరోజులో నయంచేస్తానని చెప్పాడట ఇంటి దోషాలు తొలగించడానికి పూజ చేస్తానని హామీ ఇచ్చాడట.

తియ్యటి మాటలకు ఆ గృహిణి బోల్తా

## జిల్లా వార్తలు

పడిపోయినట్లుంది. పూజకు సామగ్రి అంతా సిద్ధంచేసి, అడ్వాన్సుగా 700 రూపాయలు సమర్పించిందట. పూజ సమయానికి బంగారు దండ అలంకరించాలంటే, అదీ చేసిందట.

పూజ మొదలు పెట్టగానే ఆమె స్మారకం తప్పి పడిపోయిందట. లేచి చూసుకునేసరికి ఇంట్లో డబ్బు, దక్షిణం, నగలు, స్టీలు గిన్నెలతోసహా విలువైన సామాన్లు అదృశ్యమైనాయట ప్రక్కి వైద్యుని సంగతి చెప్పనే అక్కరలేదు.

ఆ ఇబ్బందికర సమయంలో ఆమె ఇంట్లో ఒంటరిగా వుండటంవల్ల, అప్రమత్త గృహిణి దొంగకు తేలిక చిక్కింది. ఎవరికీ ఈ విషయం చెప్పకుండా సైగ్గా వుంటిలో ఉండని తెలుస్తోంది.

అంతకు క్రితం ఆత్మకూరు నాగలిలోని ఒక మహిళాసంఘం కూడా ఇదే ప్రకారం మోసపోయిందని తెలిసింది. దాదాపు మూడువేలు పోగొట్టుకున్నప్పటికీ ఆమెకూడా పోలీసు ఫిర్యాదుకు పోలేదు.

ఆత్మకూరు చుట్టుప్రక్కల గ్రామాల నుంచి కూడా ఇటువంటి వార్తలు అక్కడక్కడా వినిపిస్తున్నాయి. ఎవరో మేధావులైన దొంగలుగా వున్నట్లున్నారు మీకు జాగ్రత్తగా వుండటం మేలు.

○ ○ ○

ఇందుకూరుపేట తాలూకా, పాపిరెడ్డి పాలెంలో 4 తేదిరాత్రి పెద్ద బందిపోటు యత్నం జరిగింది. అర్ధరాత్రి సమయంలో కేవలం డ్రాయర్లు మాత్రమే ధరించిన 8 మంది మొరటుయువకులు మొదట తోటపల్లి గూడూరులో ఒక కోళ్ళఫారంపై దాడిచేశారట. ఈలోగా చుట్టుప్రక్కల వారు లేచి, గుమికూడడంతో భయపడి

—కొరవ 8 వ పేజీలో

# చెడిన బోర్లు— తీరని నీటి సమస్య

ఆగస్టులో అన్నీ చేసినా ఆగిపోతోంది ఉన్నట్లుంది. వెంకటగిరి నీటి సమస్య. తాలూకాలోని ఏ గ్రామంలో బోర్లున్నాయి, 75 గ్రామాలకుగాను 650 బోర్లున్నట్లు అధికారుల లెక్క. ఈ లెక్క ప్రకారం చూస్తే వెంకటగిరిలో నీటిసమస్య లేనట్లే లెక్క. వర్షాభావ కారణంగా ఎక్కడంటే, వీటిలో పనిచేసేవి పాతికభాగం కూడా లేకపోవడమే.

సమితి అధికారులు వున్నవి పాడుబడుతుంటే, చూస్తూవూరకొని, కొత్తవి వేయడానికి తహతహలాడుతున్నారు. తెలుగుదేశం ప్రభుత్వంలో నిధులు తక్కువున్నాయి కొత్త సమితికి ఈ సంవత్సరంలో పట్టుమని పది కొత్తబోర్లుకూడా వేయలేకపోయారు. ఫలితంగా గ్రామాల నీటిసమస్య అట్లనే మిగిలిపోయింది.

అధికారులు సమితిలోవున్న బోర్లన్నింటినీ లెక్కతీసి, ఏవి ఎందుకు పనిచేయటంలేదో వివరాలు సేకరించి, ఒక పథకంప్రకారం చెడిన బోర్లన్నింటినీ రిపేరుచేయిస్తే, నీటిసమస్య చాలావరకు తీరిపోతుంది.

వీటికి నీటి రిపేరుకోసం మెకానిక్కులుకూడా వున్నారు. వారు ఎక్కడున్నారో, ఎక్కడ, ఎప్పుడు పనిచేస్తున్నారో అధికారులకు తెలియదు. మొన్న 13 తేది సమితి సమావేశం జరిగితే, సర్పంచ్‌లందరికీ ఇదే ఫిర్యాదు.

## వెంకటగిరి వార్తలు

అగస్టు నెల వస్తున్నా వర్షాలు లేవు, వచ్చే సూచనలుకూడా కనపడటంలేదు. బావులు ఎండిపోయాయి, అధికారులు తక్షణం మరమ్మత్తు పనులు జరిపించకపోతే గ్రామాలు అల్లాడిపోతాయి.

### బంగారుపేట బ్యాంకు వార్షికోత్సవం

వెంకటగిరి తాలూకా బంగారుపేటలో పినాకిని గ్రామీణబ్యాంకు ద్వితీయవార్షికోత్సవం ఇటీవల జరిగింది. వెంకటగిరి సిండికేట్ బ్యాంకు మేనేజరు శ్రీ ఎస్. మహేంద్రనాథ్ సభకు అధ్యక్షత వహిం

—కొరవ 11 వ పేజీలో





# జి ప అధికారుల నిర్లక్ష్యంతో కావలి ఐ టి ఐ విద్యార్థుల నోట్లో మట్టిపడింది!

ఎవరికి పుట్టిన బిడ్డవురా, వెక్కివెక్కి ఏడ్వనే అన్నట్లుంది కావలి జిప ఐ టి ఐ దుస్థితి. సంవత్సరాల తరబడి గదుల్లో మూలగుతుండిన శిక్షణా పరికరాలకు దుమ్ముదులిపి ఐ టి ఐ ప్రారంభించారు. ప్రారంభోత్సవం పేరిట పెద్ద ప్రచారార్భాటం చేశారు. అంతే ఆతర్వాత దాని అతీగతీ పట్టించుకున్నవారు లేరు.

ఇందులో మూడువందల మంది విద్యార్థు

**చిగురుపాటి మాల్యాద్రి**

లకు శిక్షణ పనులున్నాయి, అంత మందినీ చేర్చుకున్నారుకూడా. కానీ వారందరికీ సరిపడా టీచర్ల నియామకం జరగలేదు. కొన్ని సబ్జెక్టులకు అయ్యవార్లు లేకుండానే రెండేళ్ళ కోర్సు పూర్తిచేసేశారు. కాని గ్రేడులకు శిక్షణ ఇచ్చే పరికరాలు లేవు. అవి లేకుండానే విద్యార్థులకు పరీక్షలుపెట్టి సర్టిఫికెట్లు మంచి తరిమేశారు.

అన్నిటికీ మించి ఇక్కడి విద్యార్థులెవరికీ స్టైఫండ్ ఇవ్వలేదు. వృత్తి విద్యాపథకం క్రింద నెలకొల్పిన ఈ సంస్థ ప్రారంభసమయంలో; విద్యార్థులందరికీ స్టైఫండ్ ఇస్తామని వ్రాతమూలకంగా వాగ్దానం చేశారు. కానీ తర్వాత ఆ విషయం పట్టించుకునేవారు లేరు.

జి. ప స్థాయీసంఘ సమావేశాలలో ఒకటికి నాలుగుసార్లు పేరు ఈ ప్రస్తావన తెస్తే వచ్చేనెలలో పూర్తిగా చెల్లిస్తామని ఎప్పటికప్పుడు తప్పుడు సమాధానాలు చెప్పారు. అప్పటి కలెక్టర్ కుమారి కె. సుజాతారావుగారు శ్రద్ధతీసుకుని, ఒకసారి సెప్టెంబర్ నెలనుంచి 83 డిసెంబరు నుంచి 84 మార్చివరకు నాలుగునెలల స్టైఫండ్ (5880) చెల్లించారు. అంతటితో సరి

దీనిపై విద్యార్థులు చేసిన ఆందోళనలు, జిప సమావేశాలలో ప్రశ్నలు అరణ్యరోదనలై పోయాయి. విచిత్రమేమిటంటే అటు జిపలో కాని, ఇటు సాంఘిక సంక్షేమ కార్యాలయంలో కాని ఈ సంస్థకు సంబంధించిన ఫైళ్ళు సరిగా లేవు. విద్యార్థులకు స్టైఫండ్ ఇవ్వాలా, ఇస్తే ఏ నిధుల నుంచి అన్న విషయమే చిక్కింది. అధికారులకు తెలియదు. సోషల్ వెల్ఫేర్ అధికారినడిగితే

—కొరవ 11వ పేజీలో

# మన గోపాల్‌రెడ్డి సాధించిన మరో ఘనవిజయం.

హైదరాబాద్ : శ్రీనివాస లో

కాకినాడ : శ్రీదేవి లో

**100** రోజులు అన్ని ఆటలు హౌస్‌ఫుల్ అయి

ఆంధ్రప్రదేశ్ స్టేట్ రికార్డ్ సాధించిన చిత్రం.

21 కేంద్రాలలో శతదినోత్సవం జరుపుకుంటున్న చిత్రం

భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్స్ ప్రతిష్ఠ నిలిపిన చిత్రం.



# మా పల్లెలో గోపాలుడు

ఎస్.గోపాల్‌రెడ్డి B.Sc(AG) కోడిరామకృష్ణ

శతదినోత్సవ వేడుకలు 20-7-85 తేది సా॥ 6 గంటలకు

మద్రాసు న్యూ వుడ్‌ల్యాండ్స్ హోటల్ లాన్స్‌లో

మీ ఆశీస్సులతో జరుపుతున్నాం – మీ ఆగమనాన్ని ఆకాంక్షిస్తున్నాం

–భార్గవ ఆర్ట్ ప్రొడక్షన్స్

## ●● శ్రద్ధాంజలి

# పెనుబాక రాజేశ్వరి

10-7-85 తేది మమ్ము దుఃఖసాగరములో ముంచి
స్వర్గస్తురాలైనది. ఆమె పవిత్రాత్మకు
శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

### ఉత్తరక్రియలు

24-7-85 తేది బుధవారం
విరువూరులో స్వగృహమున జరుగును.

– పెనుబాక వెంకటరమణారెడ్డి భర్త

పెనుబాక శ్రీనివాసులురెడ్డి (వాసు)-కుమారుడు, పి. సురేఖ-కుమార్తె, కడలూరు కేశవ రెడ్డి తండ్రి కడలూరు వరలక్ష్మమ్మ-తల్లి పెనుబాక సునీతమ్మ బొమ్మిరెడ్డి సీతాలక్ష్మి లెక్కల వసంతలక్ష్మి-చెల్లెళ్ళు, డాక్టర్ పెనుబాక సుబ్బరామిరెడ్డి(పొదలకూరు) పెనుబాక సుందరరామిరెడ్డి (విరువూరు) మరుదులు.



జననం : 27-12-49
నిర్యాణం : 10-7-85



మా యింటి దివ్యజ్యోతి
మా ఆత్మబంధువు
పేదప్రజల జీవన జ్యోతి
ఈ నాటి మా అభివృద్ధికి కారకుడు

# కె.వి.ఆర్.

## (కలవకూరు వెంకటరెడ్డిగారి)

## దశమ వర్ధంతి

20-7-85 తేది శనివారం కె.వి.ఆర్, గారి
సమాధితోటలో జరుగును.
వారి పవిత్రాత్మకు

మా శ్రద్ధాంజలి
సమర్పిస్తున్నాము.

-కె.వి.ఆర్ బ్రదర్స్ అండ్ సన్స్

Edited, Printed & Published by N. Sree Ramamurthy, Printed at The Zamin Ryot Press, Thipparajuvari Street, Nellore (A. P.)